# కల్పవల్లి


రచయిత

కృత్తివెంటి వెంకటేశ్వరరావు

బందరు


వెల 0—8—0

# విజ్ఞప్తి

సహృదయులకు !

ఈ నా కల్పవల్లి అను ఖండకావ్యమునందలి కొన్ని భాగములు పత్రికలయందు ప్రచురింపబడినవి, దూర ప్రసార యంత్రమున చదివినవి. అయిననూ, పూదేనె నిందిందిర మాటిమాటికినీ నాస్వాదించుచునే యుండునుగదా! నా పద్య పుష్పంబులను మాలికగా గుచ్చి ఆంధ్ర భాషాయోష కలంక రించుభాగ్యము కల్గుట కెంతయూ ముదావహము. సత్కార్య ములకు విఘ్నములు సహజములేగదా? ప్రథమయత్నంబగుటం జేసి కొన్ని విఘ్నంబులు వాటిల్లిననూ అవికాలక్రమంబున దూదిపింజలవలె తూలిపోయి నేటికి యీకావ్యము ఆంధ్రప్రజల హస్తపద్మముల యందలంకరింప నాకృషి ఫలోన్ముఖమైనది. నా ప్రార్థనమాలించి నాకవిదుహితవదనారవింద మవలోకించి అంకితమొందుటకంగీకరించి గ్రంథముద్రణకగువ్యయమొసంగి ఆదరించిన నిరతదాన ధర్మలక్షణ లక్షితులునూ బుధకోటికి కొంగుపసిండియని పేర్వడసి యశోవిశాలురై సాహితీవాటి కలమేలి పసిడిమేడలను నిర్మించుకొనినసాహిత్యాభిలాషులునూ నిరంతర పరోపకార పారీణులునూ జమిందారులునగు శ్రీశ్రీశ్రీ కవికులాలంకార జవ్వాది లక్ష్మయ్యనాయ్డు ఎం.ఎల్.ఏ., గారికి నా హృదయపూర్వక వందన శతంబు లర్పించుచున్నాడను. నా కల్పవల్లిని ఆశీర్వదించుచూ తమ అమూల్యాభిప్రాయంబు లొసంగిన కవిసార్వభౌములకు, నాటకపితామహులకూ నాకృత జ్ఞతాభి వందనములు.

కృత్తివెంటి వెంకటేశ్వరరావు

# విషయ సూచిక

# అభిప్రాయములు

కల్పవల్లి యొక ఖండకావ్య మనంబడు తెలుగు గ్రంథము. ఇందు బాబూజీ, అమరజీవి, రవీంద్రుడు, గ్రంథాలయోద్యమము, స్వారాజ్యరథము, ఆంధ్రకేసరి లోనగు విషయములు వర్ణింపఁబడియున్నవి. ఈ కావ్యము బందరు వాస్తవ్యులు శ్రీ కృత్తివెంటి వెంకటేశ్వరరావుగారు రచించిరి. స్థాలీపులాక న్యాయముగా గ్రంథకర్తగారే నాకీ గ్రంథము చదివి వినిపించిరి. వెంకటేశ్వరరావుగారి కవిత్వము నాతికఠిన మృదు మధురమై యుండును. పద్యము చదువ నారంభించినది మొదలు కమ్మెచ్చునందీగనాసాగి నడుచుచుండును. వీరి కవిత్వములో సామాన్యముగా క్లిష్టపదములుండవు. వీరు మఱి కొంత కవితాపరిశ్రమచేసినచో వీరి కవిత్వము నంది తిమ్మన పద్యకవిత్వమువలెనుండునని నావిశ్వాసము. ఈ కల్పవల్లి కవికులాలంకార శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుఁడుగారికి నంకితముచేయుట బంగారములో మణిని(గూర్చినట్లు విరాజిల్లుచుండునను నిశ్చయము. - శ్రీ కృత్తివెంటివారు జగత్ప్రసిద్ధిగాంచిన నియోగి బ్రాహ్మణ కులంబునకు చెందినవారు. వీరిపూర్వులుద్యోగములుచేసియు, కవిత్వాదు లొనరించియు మిగుల విఖ్యాతిని గాంచినవారు. ప్రస్తుతము వీరు బందరు హావేలీలోనుండి ఉయ్యేల మంచమున నూగుచు నిరంతరము కవితాగోష్ఠిందగిలి ముద్దులొలుక మఱికొన్ని మంచి గ్రంథములువ్రాసి ఆంధ్రభాషామతల్లికి నలంకారములు గావింతురుగాక. వీరికి భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక.

రాజమండ్రి
1—6—57

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,
ప్రభుత్వాస్థానకవి.

కల్పవల్లియను నీ ఖండకావ్యమును నేను చదివితిని. పద్యములన్నియు రసవత్తరమైన శైలిలో సంపుటీకరింపబడినవి. ఈ గ్రంథకర్త పాతకవుల ప్రబంధశైలికి పరువులెత్తక బహు మధురసుధారసములొలుకు మృదువైనభాషలో నీపాత్రమును రచించుట ప్రశంసాపాత్రము. అయినప్పటికి సమాసభూయిష్ఠమగు పద్యములచ్చటచ్చట ఆశిముత్తెములు పొదిగినట్లు రచించినాడు.

దీని రచయిత శ్రీ కృత్తివెంటి వెంకటేశ్వరరావుగారు నాకు చిరపరిచితులు. వారి కవితా సాంప్రదాయములుకూడ నాకవగతమే. వీరచిరకాలములో ధూర్జటిపలుకుల మాధురీ గరిమ నందుకొనగలరని నాయాశయము.

పూవునకు తావి కలిగినట్లు కవితాకన్యకు కవికులాలంకార శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు భర్తగాలభించుట ముదావహము. శ్రీ కవిగారు వర్ణించినవారి యశోవల్లి దిగంత విశ్రాంతముగా వ్యాపించి కవిలోకమునకు పెట్టనికోట కాగలదని ఆశించుచున్నాను. కావున కృతికర్తకును కృతి భర్తకును భగవంతుడాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించు గాకయని యాశీర్వదించుచున్నాను.

ఇట్లు

చిత్రపు హనుమంతరావు

నాటక పితామహ; మధురకవి.

# 1. అగ్రజుడు

గంభీరుండు మదీయదేశికుడు, సంకల్పంబుకల్గించి, వి
ద్యాంభోరాసి, కవిత్వగాంగలహరిన్ తానంబునాడించె, నా
రంభంబందుననున్, దదగ్రజున్దలచి ప్రారంభించెదన్ కావ్యమున్
శుంభద్వేగ కవిత్వపున్నడల విస్ఫూర్తిన్ విజృంభింపగన్॥

నాయనుగుంస హోదరుడు, నాసుగుణాలయముగ్ధ, శైశవ
ప్రాయపుబాల, యీమధురవాణిని, దివ్యమనోజ్ఞవాణిఁ, న
త్యాయత కీర్తిసంయుత మహామహి మాన్వితగాగఁ, సత్యనా
రాయణ ముద్దులాడి చికురంబులు దువ్వుచుబల్కెఁ, పండిత
ధ్యేయుని పల్కునిక్కమగు నేనికృతార్థుడఁ, సత్కవీంద్రుడన్॥

# 2. కృతిపతి ప్రశంస

అంకిత మిత్తునేననిన యంబున వాకొనినంత మోదము
ద్రాంకితుడయ్యె ముద్రణకు ద్రవ్యమొసంగె చతుశ్శతంబులన్
శంకలుడుల్లివోయెను రసాతలనాథుఁ జవాదివంశమీ
నాంకుని ప్రాపుపొందినది నాసుకుమారి కికేమిగావలెన్

ఖిలముగా నుండునది ధాత్రికృతియటన్న
యల్లసాని పెద్దన పలుకాకళించి
వరలుచున్నాడు పెనుగొండప్రభువరుండు
గౌరవకిరీటమును మస్తకమునదాల్చి॥

కమనీయసు కవితా గ్రంథముల్ చేసాచి
కృతులందు కొనునట్టి ప్రతిభనీది
యేవేళ కవివరు లేతెంచినను గాని
గౌరవంబొనరించు ఘనతనీది
పూర్వము కవులను పోషించు రాజుల
వతను నిల్పగబూను ఫణితినీది
యర్థినిధానమై యాచకావళినెల్ల
సంతోషపెట్టు నాసక్తినీది॥

లలితకళల సాహిత్యాభిలాషనీది
సజ్జన స్తవనీయ, నేస్తంబునీది
సుగుణరత్నాకరుడగు భోజుడవు, కవి కు
లమునకెల్ల నోజవ్వాది లక్ష్మ యాఖ్య!
యంకితంబుగ మత్కృతినందుకొనుము॥

ఆంధ్రదేశమందున కవులన్నవారు
చెళ్ళపిళ్ళ కవీంద్రుని శిష్యులండ్రు
యాంధ్రదేశమందున కవులన్నవారి
కృతి సుకన్యల కీవెగాపతి వటండ్రు
కల్పవల్లిని గొనుము వాఙ్మయధురీణ॥

విద్యార్థులకు స్కాలువేతనాలాదిగ
సాయంబు లెన్నెని సలిపినావు
కైతలలోని చక్కని పోకడలుగాంచి
ముదమొప్పగా పొంగి పోయినావు
పెనుగొండ పట్టణంబున కెనలేని ప్ర
ఖ్యాతి దిశలఁగూర్ప గలిగినావు
పేదసాదలనెల్ల వీక్షించి కరుణతో
నిరతాన్నదానంబు నెఱపినావు
పొగడుచుండుటగాదు, నీపూర్వజన్మ
సుకృతమేమియొ గానియశోధనంబు
భోగభాగ్యంబు లొనగూడె, త్యాగి!నిన్ను
పోలరెవ్వరు తెల్గుజిల్లాలలోన

దైవచింతనగల్గు నీ దాతృమహిమ
వాడలు పెంచె, నిండ్రి ధనుస్సువోలె, వసుధ
నాంధ్రి దేశంబ నెడు విశాలాంబరమున
మెఱయుచున్నది వజ్రింపు టారపుతోడ॥

పెనుగొండ పురమునందున
వినిపించును నీ చరిత్రి వీనుల విందై
జనములు పరిపరివిధముల
గొడియాడుచు నుంద్రునిన్ను కోవిదమాన్యా!

కట్టించినాడవు కవితా లతాంగికి
దనివో వునట్లు యద్దాలమేడ
వెలయించినాడవు తులలేక వెలుగొంద
తనయు పేరిట గొప్పధర్మశాల
నిలిపినాడవు గ్రింథ నిలయంబు నీదేవి
మహిళా సమాజ సన్మానమంద
మొలిపించినాడవు ముందువారికి పుణ్య
ముల తోవలను చూపు మొగలితోట॥
హృదయమందున సుగుణంబు లొదిగి నీకు
ఒక్క చక్కనెదొంతరై చిక్కెనేమొ
తెలుప నేలముఖమున మూర్తీభవించు
మిళుకు మిళుకున తారకావళులవోలె॥

విలసద్భూరికవిత్వతత్త్వసుగుణా విఖ్యాతసత్కీర్తి ను
జ్జ్వలభంగి న్దిశలందునించిన కవివ్రాతంబు లగ్గించి ప
ద్యలతాంతాన్విత హారపంక్తులిడె నీ కశ్రాంతమై నిల్చె వె
న్నెల శోభాకకుభావృతంబు సుషమాని స్తంద్ర కీర్తిద్యుతుల్॥

వచ్చిన సత్కవీశ్వరుల పద్యములన్నిని పాలసంద్రమున్
దచ్చిన రీతిగా నరసిగ్రంథముల న్కృతులంది చేతికి
న్వచ్చిన యట్లు ద్రవ్యమిడి పంపుమహాశయ! సార్థకంబుగా
లచ్చికి నాటపట్టగు విలాసము నీకు జవాదిసత్ప్రభూ॥

పదియారేడుల చిన్నదీయబల విద్వాంసుల్ ప్రశంసింప నిం
పొదవన్ పద్యములల్ల నేర్చినది సొంపుల్ గుల్క శ్రావ్యంబుగా
చదువంగా గలకన్య వచ్చినది నీ జవ్వాది సౌరభ్యము
ల్మది కాంక్షించి హుటాహుటిన్ కవికులాలంకార! చేపట్టుమా॥

చూచినదాది నీదగువచో విభవంబును సౌకుమార్యము
నాచరికంబు ఠీవి తరుణత్వము మేనికడాని వన్నెలున్
గోచరమై వరించి యదుగోనును సిగ్గున పెండ్లికూతురై
నీ చిఱునవ్వువెన్నెలల నిల్చెను నా కవితా కుమారి వే
వేచనుదెంచి పొందుము పవిత్రకళత్రచిరత్నప్రాప్తిగన్॥

వంచిన శీర్షమెత్త కవ్రివర్తిలు కస్యకముద్దరాలు, వ
ర్ణించెను కావ్యముల్ సుగుణలేఖ్యతనూసు విలాసినయ్యు మీ
పంచవ శింపకోరుకొని వచ్చినయట్టి పసిండిబొమ్మ, రా
వించి యనుగ్రహించి కృపపెంచి వరించిసుఖించి మించుమా॥

కొందరు భోజుడవని, కవి
బృందము కృష్ణరాయ పృథివీపతిగా
యెందరో వాకొను చుందురు
కందములోదెల్ప దానకర్ణుడవయ్యా!

పెనుగొండ పట్టణంబున
ఘనమాగనిగా జవాది కలదని వింటిన్
గొనిపోవకవులు పాంథులు
యనవరతము వచ్చిపోవు టబ్బురమయ్యెన్

లక్ష్మికి వాణికి పడదట
ఓక్ష్మపతి కతులీగి యుండిరి వాణే
లక్ష్మయనీ చినరాణిగ
లక్ష్మయు పెదరాణి యాదిలక్ష్మిగ నమరెన్॥

హారతు లెత్తుచుండ్రి కవులందరు నీకు వదాన్య శేఖరా!
పేరు ప్రతిష్ఠలందితివి విద్దెలరాణి సపర్యచే, జమీం
దారులు, రాజరాజులు నుదారమనస్కృత బొల్చిరొక్కొ? వి
స్తారమరీచులీనువిలసన్మయశారదచంద్రిచంద్రికా
సారముభాతి నిల్చెను యశః పటిమంబు జవాది భూపతీ॥

కమ్మనిగాలిలో చెఱువుగట్టున జేరి పసందుగాండ్రు ని
త్యమ్ము తలంచుచుందురుగదా, భవదీయ వదాన్యలక్షణం
బిమ్మెయి నిల్చిపోయినది యీ పెనుగొండను నీ తటాకనీ
రమ్మును ద్రావుచున్ తరతరాలకు నిన్ను స్మరింపరే జనుల్॥

యే భవమందునన్ సుకృతమేమియొనర్చి జనించినాడవో
ప్రాభవ సంపదల్ తలలువంచి జోహారొనరించుచుండె నీ
కీభవమందు భృత్యులయి యెల్లకళల్ కయిమోడ్చినిల్చి ని
న్నాభ యశస్సమేతునిఁ నొనర్చెను బ్రహ్మరధంబు బట్టుచున్॥

తన జటాజూటమందున సతీమణి గంగ
యర్ధచంద్రుడు వేడ్క నమరియుండ
ఫణమువిప్పి యదేచ్ఛఁ వక్షస్థలంబున
యహిరాజు తాండవ మాడుచుండ
పవన సారణపతి పడగపై మణులెల్ల
వింతైన రమణీయ కాంతులీన
నందీశ్వరుడు ముందు నన్గావుమంచని
సాష్టాంగపడి నమస్కార మిడగ
మోదమున యంకపాళి లంబోదరుండు
వామ భాగమునందు పార్వతియునుండ
సరస సల్లాపములనాడు సాంబమూర్తి
యాయురారోగ్య భాగ్యంబు లందజేసి
మించువేడుకనిన్ను రక్షించుగాక॥

# 3. కల్పవల్లి

కల్పవల్లీ! నీకు కవి సార్వభౌములు
శ్రీపాదవార లాశీస్సు లిడిరి
సాహితీపరులైన సత్కవీంద్రశ్రేణి
రంజిల్లి నీకు దీర్ఘాయు వనిరి
వరియించినంతనే సరసుడై పెండ్లాడె
వందితుండైన జవ్వాది ప్రభువు
ముత్యాలతక్కుతో ముందరనిల్చెను
చెలువొప్పగా గంధసింధురంబు॥
కొంగు కొంగును ముడివైచు గొంచుపోయి
యనుగుభర్తనుగూడి నెయ్యంబుమీఱ
కనులపండువగాగ నాకవికుమారి !
ఏనుగంబారినెక్కి యూరేగవమ్మ॥

మధుర కవియు, నాటక పితామహుడును, కవి
రాజు చిత్రపు హనుమంతరాయ సుకవి
చల్లుచున్నాడు పసిడి యక్షతలునేడు
ఘనతగాంచుము మాతల్లి! కల్పవల్లి!

# 4. గురుస్తుతి

చెళపిళవారి శిష్యుడను చిన్నతనంబుననుండి వేడ్కతో
జిలిబిలిగా కవిత్వము రచించి సభాస్థలులందు బాడుచు
జ్వలగుణ రత్నవార్ధి గురువర్యు నుతించుచు నుంటినాదుత
ప్పులను పరిత్యజింపగను మ్రొక్కెద వొప్పులనే గ్రహింపగన్॥

గురువరు పాదపద్మములకున్ తొలుదొల్త నమస్కరించి,యీ
సరణిని పద్యజాలములు శక్తికొలంది రచింప నేర్చితిన్
సరసులు సద్యశోనిధులు సత్కవిజంట శతావధానులా
తిరుపతి వెంకటేశ్వరులదివ్యవధానవిధానచాతురిన్
సిరులచెలంగు వారికవి సింహులఁ పద్యముల న్భజించెదన్॥

కడియంబందున మీపదంబుల సమక్షంబందు గూర్చుండి,సం
దడిగా కావ్యముల స్మరించు తరి విద్వద్వైఖరిన్ దెల్పుచున్
వడిగా పద్యముజెప్పగాఁ దగువిధానంబెల్ల వాక్రువ్వ, నే
ర్పడె పాండిత్యము మీకృపాగరిమచే రవ్వంత యీపాటిగన్

అంటదు పూర్వజన్మఫలమన్నదిలేక కవిత్వమంచు నే
వింటి బుధుల్ వచింపగ కవిత్వమహత్వపటుత్వశైలి మీ
యింట జనించి పెంపయి యహీన యశంబానగూర్చెగాదె మీ
వంటి మహాకవీశ్వరుల ప్రాపు లభించుట కేను ధన్యుడన్

నాయెడ పుత్రవత్సలత నాటి భవద్హృదయంబున న్మహో
ధ్యాయులు పెక్కురున్న, గృహమందునె మజ్జనభోజనాదులన్
జేయగ సల్పి కావ్యముల స్నేహమెలర్పి యనంతసాహితిన్
డాయ ననుగ్రహించిన, విడంబకవీంద్రవనేభ కేసరీ ! ॥

# 5. బాబూ జీ

* కాలిడి నీవు నాడు నవఖాళిని దుందుడుకుల్ తురుష్కులూ
యూలలలోని పాపల నహంకృతికి న్బలిసీయ రక్తమే
కాలువలై స్రవింప జనకాండము దద్దరిలన్ భవత్కృపా
జాలమె రక్షయయ్యెను కసాయిముతాలకుతారధారకున్ ॥

జలధిపై హక్కు భారతీయులకు గలదు
తెల్ల వారలకే బొడ్డు ముల్లె గాద
టంచు నుప్పు జేయగ సాహసించినావు
తెల్లదొరలకు గుండెలు ఝల్లు మనగ ॥

పలుకు పలికిన ముత్యంబు లొలుకుచుండు
యాజ్ఞ యొసగిన ప్రజలెల్ల రనుసరింత్రు
యాగ్రహించిన వర్షమై యగ్ని కురియు
కలియుగంబున దైవమే గాంధి తాత ॥

శాంతిసత్యాహింస సాధనంబుల చేత
తెల్లదొరల గట్టి దెచ్చి నావు
క్విట్టిండియా యంచు కేసరై గర్జించి
దొరలెల్ల రను పాఱద్రోలినావు
పాశ్చాత్య పాలన పార్లమెంటులలో స్వ
రాజ్యమిమ్మంచు పోరాడి నావు
రక్తబిందువు నేల రాలకుండగ శాంతి
సమరంబు నెగ్గింప జాలి నావు ॥
నేడు నాయకు లెల్ల రానాడు నీవు
దిద్దిపోయిన త్రోవల హద్దులందు
యేలుచున్నారు రాజ్యంబు నేలికలయి
"తూ" "చ"తప్పక, కేల్మోడ్చిదోయిలించు
పూజ్యబాబుజీ! నీకు స్వరాజ్యలక్ష్మి ॥

* భారతదేశ దాస్యమును బాపగ దీక్షవహించి సౌఖ్యశో
భారమణీయజీవితపువైభవమెల్ల త్యజించి, బందియై
ఘోరవిపత్పరంపరల గుందిస్వరాజ్యము దెచ్చి, శాంతి భా
స్వారము గూర్చి నట్టి కరుణానిధి గాంధిని గాల్చి, బల్మిమై
ధారుణి గూల్చుటా?! రుధిరధారలె కానుకలా, తపస్వికిన్?!

* తరతరంబులనుండి నిద్రాళియైన
జాతినెల్ల మేల్కొల్పిన నేత తాత
భారతీయుల దురదృష్టవశముచేత
నేడు గాంధీమహాత్ముడు లేడు లేడు ॥

* ముందర నిల్చి నమ్రుడయి మ్రొక్కి తటాలుననంతమందిలో
హిందువుడై, మహాత్మ! నిను హింసయొనర్చెనె! రాక్షసుండునీ
కెందున దాపరించెనో కో హిందుజనాళిని లేనిపోని యీ
నిందలపాలు జేసె యిక నీసరివారలు లేరు బాబుజీ !

* పగసాధింపగ లోదలంచి యటదైవప్రార్థనల్ సల్పగా
నగు యవ్వేళకు వచ్చుచుండగ మతోన్మాదుండునై నిన్నుకా
ల్చగ, శోకాంబుధి లోన మున్గెజనులాశ్చర్యంబు నన్బాబుజీ!
భగవంతుండని పూజసేయునిను చంపన్జేతు లెట్లాడెనో?!

* ఆయమునానదీ,తటము నందున నీదగు మేను భస్మమై
పోయెను గాలిలో కలిసి పోయెను ధూళిగ భస్మమెల్ల నీ
కాయము పోయిన న్మిగులు గావుత నీదగు తేజమింకపై
ఓయి మహాత్మగాంధి! వెలుగొందుచు నారని పూలదీపమై

*పోయెను బాబుజీ మజల పుట్టడు యిట్టి మహాత్ముడంచు నా
పోయిరి నీకునై దిగులు బొందిరి గుందిరి భారతీయులున్
నాయకు లెల్లరశ్రునయనంబుల నిల్చిరి నీవుపోయినన్
నీయవతారలీల భువినిల్చెను దేశచరిత్రలందునన్

* భౌతికంబైన నీదేహపంజరంబు
వదలి పోయితివేగాని, వసుధ కింక
చాటు కాబోదు నీకీర్తి చంద్రరేఖ
కవికుమారులు కలకంఠ కంఠ మెత్తి
పాడు చున్నారు నీగాథ పదము లల్లి

భారతదేశనాయకుని భారతభాగ్యవిధాతఁ రాట్నమా
ధారముగాగ నైచ్యమగు దాస్యము వాపి త్రివర్ణకేతనం
బారప్రతిష్ఠ జేసిన మహాత్ముని దివ్యచరిత్ర చాటుమా
నీరవకంఠమెత్తి గణనీయముగా యమునాతరంగిణీ!

* జీవనదులందు నీదు యస్తికలు పొంగి
పార్లి, దేశదేశములకు బోయి, నీతి
సత్యమును, శాంతమును, యహింసావ్రతంబు
దేశజను లందరకుఁ ప్రబోధించుగాక

---

* యీ గుర్తుగల పద్యములు ఆల్ యిండియా రేడియో విజయవాడ కేంద్ర ములో చదువబడినవి.

# 6. కన్నతల్లి

మువ్వురు పుత్రులుండి సతము న్నివసించు హావేలి యుండిని
న్మవ్వపు ప్రేమతో గను కుమారిక యుండి శ్మశానమందు ది
క్కెవ్వరు లేనటుల్ జనని! యెట్లు సహించి వశించి యుంటివో
సవ్వడి గల్గు రాత్రుల నిశాచరకృత్యభయంకరార్భటుల్॥

ఎచ్చట పుట్టినావొ మరియెచ్చట యాటలు పాట లాడితో
ముచ్చట దీర బొమ్మలకు ముద్దుగ బెండిలి సల్పినావొ నీ
యిచ్చలు దీరిపోవగ నిజేశుని జేరియు మెట్టినింటిలో
వచ్చిన నాట నుండియును వర్తిలినావు సుఖానుభూతులన్ ॥

ఆపద లెన్ని వచ్చినను యమ్మ! భవత్పదసేవభాగ్యమే
ప్రాపయి నిల్చె మాకు. భగవంతుని సన్నిధి జేరి నావు నీ
వే పయనించినావొ, నినుయే బలవత్తరశక్తి మ్రింగెనో
బాపగలేరు దుఃఖమును బంధువు లెందరు పూరడించినన్ ।

తమ్ముడు నేను నీరమున తర్పణలిచ్చుచు నిన్ను కృష్ణవే
ణమ్మకు వప్పజెప్పితిమి యస్తికలచ్చటగల్పి, నీ స్వరూ
పమ్ము దలంచి, నీదు ఋణభారము దీర్చితిమమ్మ, యింకని
త్యమ్ము మమున్దలంచి దయదాల్చుము స్వర్గపథానుగామివై ॥

వేళకురాక తమ్ముడొక వీసము జాగొనరించెనేని, స్తం
భాలనుబట్టి నిల్చి, నలుపార్శ్వముల న్పరికింతువమ్మ కా
ల్గాలిన పిల్లివోలె పసికందువ వాడెట కేగినాడొ యీ
వేళ యటంచు, ఎంతొ విలపింతువు నీ జననీత్వమెట్టిదో ॥

కన్నీరింకదు నీస్వరూప మెదుటన్ కన్పించు స్వచ్ఛందమై
ఎన్నోయేండ్లు గతింప లేదు, జననీ! యేపాటి వృద్ధత్వము
త్పన్నంబై మము వీడిపోయితివి యాభై యెన్మిదేండ్లప్డె, నీ
కన్నన్ వృద్ధులు లేరె? పెల్లుబికె మాకన్నీరు మున్నీరుగన్ ॥

అమవసలందు మాత! హృదయంబున భీతి జనింప జేయవే
బొమికెలు, బూదిప్రోవులును పుర్రెలు, కాష్ఠములందు కాలక
న్గమిలెడు మోళ్ళు భూతతతిగోడు, విభీతశృగాలనాదముల్
తమమున నీలకుంతలము లన్వొదలించుచు బ్రహ్మరాక్షసుల్
తమిగ నొనర్చు భీకరపు తాండవముల్ వికటాట్టహాసముల్ ॥

---

ఆంధ్రకేసరిలో ప్రచురింపబడినవి.

# 7. భారతి

మానిని, రాజసుందరసమానిని గానకళావిధాన వి
జ్ఞానిని, పూజితాఖిల విశాంపతికోవిదసత్కవీశ్వరా
స్థానిని, పండితోత్తమలసద్ఘనమానసపంకజాతసు
స్థానిని తమ్మిచూలిదొరసానిని నిన్నుస్మరింతుభారతీ.

శ్రీలలనామనోహరవిరించిపురాంతకశక్రిసన్మదివి
క్ష్వాలమహర్షులే సుగుణగణ్యను చిత్తముల న్నుతించివి
ద్వ్యాలతికాలవాలమగు నాత్మల పెంపెసలారునట్టి స
చ్ఛీలకు నీకు వందనము జేసెద నింపుగ భారతీ సతీ!

బాలుడనమ్మ నేను భగవంతుని దానవగర్వపర్వతో
న్మూలిని, రామమూర్తిన్నృపముఖ్యుని తొత్తభజించితి స్దయా
శాలిని, పూర్వపుణ్యఫలసంచితసత్కవితావిధిజ్ఞతన్
వాలి భవత్పదాబ్జముల భక్తి నుతించెద భారతీసతీ!

శ్రీకాంతాహృదయాబ్జభాస్కరుని రాజీవాక్షునిన్ దానవో
ద్రేకంబార్చిన వీర్యశాలిని కృపాబ్ధిన్ మ్రొక్కుచున్ లోక ర
క్షాకార్యజ్ఞుని మున్నె గొల్చితిని సుస్వాంతంబున న్వేండి ని
న్నె కంజేక్షణ గొల్తునో భ్రమరవేణీ! భారతీ సుందరీ!

ఫుల్లాబ్జానన నీపదాంబుజయుగంబున్ భక్తి నర్చింపగా
నుల్లాసంబు ఘటింపవే కవులకున్ నుల్లంబున న్నిల్చి శో
భిల్లం జేసి సమస్తశబ్దవితతిన్ ప్రీతిన్ యశఃకాయులో
తల్లీ! పోతన తిక్కనాది కవిధాతల్ భారతీసుందరీ!.

---

త్రిభాషాపత్రిక యువయాదవలో ప్రచురింపబడినవి.

# 8. అమరజీవి

జాతీయోద్యమదీక్షలన్మెలగి సౌజన్యంబు దీపింప గాం
ధీ తత్త్వంబున నామహామహుని యాదేశంబుల న్సర్వసా
భ్రాతృత్వంబు స్వరాష్ట్రసిద్ధికయి తీవ్రంబైన రోషాగ్ని, నా
హూతిం జేయ మహాత్ముడేగితివె, నోహో యెంతవిడ్డూర్యమో!

ఆనాడు, పొంగారె యాంధ్రులరక్తంబు
యాంధ్రరాష్ట్రపు వాంఛ లటమటించి
ఆనాడు, చెలరేగి రాంధ్రులెల్ల తెగించి
ప్రాణాలనొడ్డి రాష్ట్రంబు కొఱకు
ఆనాడు, సోదరు లావేశమున గుప్పె
కోపపూరిత వహ్ని గోళములను
ఆనాడు, నూటాడె యఖిలాంధ్రలోకంబు
యాంధ్ర నాంధ్ర ధ్వాన మావరించి
నాడు, ప్రకృతియే భీభత్స నాట్యమాడె
విధివిలాసంబు కంపించె విలయమట్లు
నాడె, యరవలు గజగజ లాడినారు
పూర్తిగా తమకొంపలేమునిగినట్లు.

బుద్ధుడా క్రీస్తుడో భువనమోహనమా జగదేకమూర్తి యా
వృద్ధసబర్మతీతపసి వేదనల న్వాని నమ్మి ఖద్దరున్
శ్రద్ధగ దాల్చి నేటికి స్వరాష్ట్రము దెచ్చిన దేశ సేవసం
సిద్ధికి కార్యదీక్షత విశిష్టతకున్ ప్రణమిల్లి మ్రొక్కెదన్॥

ఆంధ్రరాష్ట్రభర్మ్యహర్మ్యంబులనుశక్తి
ధారవోసి రక్తధార వోసి
కట్టి తుదకు జూడగానైన నోచక
జేరి నావె స్వర్గ సీమ కకట॥

కట్టు వారలా కరు కాపురముం జేయు
వార లింకొకరను వాక్కు నిక్క
ముగను స్పష్టమయ్యె పొట్టి శ్రీరాములూ!
బాధ నీది యనుభవంబు మాది॥

కోమటు లన్న సంపదలు కోరి వసింతురు సువర్ణడోలికో
ద్దామభవంతులందున సదా, మనరాష్ట్రము దెచ్చు తెంపునన్
నీమము బూని నీవలె గణింపక జొత్తురె కోరి? పొట్టిశ్రీ
రాములు! మృత్యుదేవతదురాగతఘోరకరాళదంష్ట్రలన్॥

వామనమూర్తియై భగవంతుడే వచ్చి
యడిగినంత బలి మూడడుగు లిచ్చె
కర్ణుండు, కోర నాఖండలునకు తాను
మేనికుండలములు దాన మిచ్చె
శివుడు పరీక్షింప జేజేత తిన్నడు
ప్రేమతో నేత్రముల్ పెరికి యిచ్చె
పావుర మడుగు టాహార్యయంబుగా నెంచి
శిబిమేని కండలు చెండి యిచ్చె
వారి నందరి మించిన వాడ వీవు
యాంధ్ర రాష్ట్రంబు గోరి మహాత్మ! ప్రాణ
మాహుతిం జేసినత్యాగి! యమరజీవి!
పొట్టి శ్రీరామ! నిను తెల్గు పుడమి వారు
మఱువ లేరింక జన్మ జన్మాలకైన॥

# 9. రవీంద్రుడు

నోబుల్ ప్రైజును దేశదేశములు విన్నుల్ సేయగా పొంది, ము
స్తాబై భారతమాత నీయశపు ముక్తాశోభలన్ గ్రాల వి
ద్యాబుద్ధుల్ దనియించు స్వర్ణమయగీతాలేఖినిన్గాంచి ని
న్నాబూ!విశ్వకవీంద్రచంద్ర! ప్రజగర్వస్ఫూర్తి శ్లాఘించెదున్॥

సాంద్రతరకీర్తివీచికాసంతతియుత
జలధినటదభంగతరంగసంగతుండు
భవ్యభారతభూమాతవరసుతుండు
విశ్వమోహనుండుకద రవీంద్రబాబు॥

నీదు కైతల చలువ పన్నీటి జల్లు
జల్లి నాడవు దేశదేశాల యందు
భారతీయులు నీదివ్య ప్రతిభ గాంచి
విశ్వ కవియంచు వెలలేని బిరు దొసంగె॥

భారతమాత పున్నెముల పంటగఁ గాంచి ప్రమోద మందగా
ఔరస పుత్రుడై జననమందిన కొంగుపసిండివీవు నీ
పేరుదలంచి నీదుప్రతిబింబము గాంచి కవీంద్రు లెల్లజో
హారు లొనర్చుచుండిరి భళిరా! కవిలోకప్రచండభాస్కరా!॥

ఆరగలేదు నీయశము యారగ జాలదు మృత్యుదేవి కా
హారముకాదు నిత్యము విహారముజేయుచు యివ్వసుంధరన్
చారుతరపరిత్రాణమయి శాంతినికేతన ఛాయ లన్కౢనో
ద్ధారక కుల్కుచుండె చరితార్థుడ వీవు రవీంద్రచంద్రమా!॥

కోకి లలుకుహూ కుహూయంచు కూయుచుండె
నిన్ను గానక మదియందు నున్న కలత
వలన వాటి నిప్పుడెవరి వశము జేసి
వెడలి పోయితి వోయి రవీంద్రసుకవి!॥

సహజ సౌందర్యమై, ప్రపంచమున దైవ
నిర్మితంబైన ప్రకృతిఁ వర్ణించి నావు
ప్రజలు పఠియింపభాషగా పరిఢవిల్ల
సరస సాహిత్యసామ్రాజ్యసార్వభౌమ!॥

విశ్వశ్రేయము గోరి గీతికల గా వింపంగ నుంకించియున్
శశ్వత్కీర్తియుతుండవై సుజనులశ్రాంతంబు కీర్తింపగా
విశ్వాసంబును చూఱగొంటివి గదా, పృథ్వీస్థలి న్వాసితే
విశ్వఖ్యాతి గడించి యీతుహినభూభృత్సేతుపర్యంతమున్॥

---

త్రిభాషా పత్రిక యువయాదవలో ప్రచురించబడినవి.

# 10. భారతాంబ

శృంగారతరుశాఖ బంగారు చిలుకవై
నైషధంబల్లె శ్రీనాధ సుకవి
పోతన్న కవితను బుంగపోతగ బోసి
భాగవతంబును వ్రాసి మించె
శ్రీరాముచరితంబు చిత్రించె వాల్మీకి
నవరసభరితంబు నా జెలంగ
భారతామ్నాయము వ్రాసె నువ్యాసుండు
పంచమ వేదమై బరగు నట్లు
మొన్న మొన్నటి వారలు నన్నయాది
కవులు నీగర్భమందున కలిగి నారు
రత్నగర్భాఖ్య నీకు సార్థ కతగాంచె
వశమె నీభాగ్య మెన్నంగ భరత మాత !॥

పలువిధపుష్పజాలముల పాలించితనవ్యగులాబిదామమున్
కలిగినవృక్షకాండమున కంటకము ల్గడు కల్గి యుండవా
ఖలమతులున్న నీదయిన గర్భము ధన్యమె యేమనందువా
బలమదమత్తసింహతతి, వానరమొక్కటి లెక్కయౌనొకో?

కాలుని వెన్నంటి కాంతుని బ్రతికించె
సావిత్రి భారత సాధ్వి కాదె
ముప్పురమూర్తుల ముద్దు బిడ్డల జేసె
యనసూయ సుగుణ గణాఢ్య గాదె
సృష్టికే భిన్నంబు చేకూర్చి పతిగోరి
నర్మద భారత నారి గాదె
యడవుల కేగెను యనుగు భర్తను గూడి
దమయంతి భారత రమణి గాదె
యగ్నిగుండాన జొచ్చిన యట్టి సీత
భూమిజాత పతివ్రత పుణ్య చరిత
నీదు గర్భంబు నందు జన్మించె గాదె
వీర నికురంబ! మాయంబ! భారతాంబ!

ఆదికవీంద్రుడంచు కవులందరు నేటికి మ్రొక్కు లీయ స
మ్మోదము తోడ రాముపరిపూర్ణచరిత్ర రచించిమించె, నా
స్వాదితరామనామసుధ పైపయి చిందగ వామలూరి వం
శోదధి పూర్ణచంద్రుడయి శోభిలు నాదికవీంద్రుగంటివే॥

వందనంబమ్మనీ కిదే భవ్యచరిత
సకల సద్గుణ సంయుత సుకవి వినుత
వాణిజ్య సాహిత్య మహిత సామ్రాజ్య లక్ష్మి
వీర నికురంబ! మాయంబ! భారతాంబ!

---

త్రిలింగ పత్రికలో ప్రచురింపబడినవి.

# 11. కోయిల

మధురమంజులగాన మాధుర్య మొలయింప
హాయిగా పాడుము కోయి లమ్మ
వింతవింతలగు వసంత శోభలగాంచి
హాయిగా పాడుము కోయిలమ్మ
విశ్వంబు మరపించు ఐశ్వర్య మునపొంగి
హాయిగా పాడుము కోయిలమ్మ
కొండకోనలలోన "కూ"యంచు మార్మ్రోయ
హాయిగా పాడుము కోయి లమ్మ
గున్న మావుల తలిరుల గుబురు లందు
కిసల యంబుల నాపోవ మెసవు చుండి
హృదయ ములుపొంగి సంతోష మొదవు నట్లు
హాయిగా, తీయగా, పాడు కోయి లమ్మ! ॥

కవుల లోన కలరు కవికోకి లనువారు
వారి కేల నీదు పేరు కల్గె?
వార లెల్ల ఘనులు పాండిత్య మందున
హాస్య మగు నిరక్ష రాస్య వీవు

పాడుచుందు వర్ధ వత్సరం బేసీవు
మరల పాడ వారు మాసములును
గాన వృష్టి కురుప గాదేవ తలుకోర
చనెద వోక్కొ గాన సభల కీవు ॥

కూయని సారెసారెకును కోలుమ సంగి ప్రశాంతసంజలో
తీయని లేయిగుళ్ళతిని దీర్ఘముగా గళమెత్తి పంచమ
స్థాయిని పాటపాడెదు ప్రజాళి ప్రఫుల్ల వనాంతరంబులన్
వ్రూయెల లూగ, మోడులు నవోజ్జ్వలమై చిగురింప కోయిలా॥

నీతను వన్నెనో కనగ నేరము తోచును కాకిపోలికన్
శ్రోత్రల కెల్లకర్ణముల శోకి హసాదోనరింప నామనిన్
గీతిక లాలపించి గిలిగింతల మైమఱపింతువీవు ఓ
లేతచిగుళ్ళ మేపరి, కులీనత నీకెటు గల్గెకోయిలా ॥

దినక రుండు కష్టించి ప్రాగ్దిశను జేరె
మంద మలయూ నిలుడోసంగె మారు తంబు
నవ్య మాధుర్య కలకంఠ నాద మొలుక
జేయు మా, గాన మునుభాను సేదదీర్ప॥

ఆరామంబులలో ప్రవాళముల నాహారించుచున్, పాంథులన్
సారంగాంకుని కౌముదీ ప్రభలు విశ్వంబెల్ల వ్యాకీర్ణమై
గారింపంగ, రతీమనోహరుడు ప్రజ్ఞన్ బాణముల్ వైవ, శృం
గారాంభోనిధి నేలముంచెదవు? నీగానంబుచే కోయిలా! ॥

తరుశాఖాగ్రనిషణ్ణవై పికమ! కాంతల్ గూడి యాక్రీడలన్
విరియన్బూచిన క్రొవ్విరుల్ పుణికి తావిన్మెచ్చి మైదాల్చుచున్
సారది న్జూతురు 'కూ' యటన్న మరినిన్నన్జూచి 'కూ' యన్న సం
గరము న్జేయు దదేమిచిత్రమొ కదా కవ్వించి నవ్వించుచున్॥

జగముల ముంచి తేల్చెను, నిశాపతి మింట సమీరమందు స్వే
చ్ఛగ విహరించు వేళ, సుమసాయకు తాపము మోసులెత్తగా
మగువలు మోహమంద పికమా! లలితస్వరమున్వెలార్చునీ
నిగళము లోని గాన కమనీయసుధామధురైకవాహినుల్॥

# 12. చందమామ

* అందముల చిందు బంగారు చందమామ
చిట్టిపాపలు సైతము చేతులెత్తి
చందమామా యటంచు నానందముగను
పిలుచు చున్నారు పాలవెన్నెలల నిలచి
పంచి పెట్టు మీచిన్నిపాపలకు సుధను

* సందె పడగానె సొంపు వాల్జడల నల్లి
కలువకన్నెలు ప్రొద్దుపొడి చిలుకరించి
వలపు కురిపింప నీమీద భ్రాంతి కలిగి
వేచి యున్నారు రావేల వేగ చంద్ర!

* పొద్దు కుంకఁ దాటి పొదల మాటున నుండి
తొంగి చూతు వీవు దొంగ వలెను
పగటి వేళలందు నగపడ వెప్పుడు
యెందు నీవు దాగి యుందు వోయి?

* జలరుహామిత్రు డస్తగిరి చాటున చేరిన యంత నెవ్వరో
పిలిచినయట్లు తూర్పు వయిపే కనుపింతువు వచ్చి పండువె
న్నెల కురియించి స్వేచ్ఛమెయి నిద్దుర బుత్తువ దేమిచిత్రమో
వెలవెల బోవ సృష్టి కనుపింపవు భళ్ళున తెల్లవారగన్॥

కలువ కన్నెలు విరహంబు కలిగి నిన్ను
స్మరణ జేతురు రాత్రిల సమయ మందు
వలపు టొయ్యారు లైన జవ్వనుల జేరి
మత్తిలి పరుందువా? పట్టు మబ్బులందు

ఎచ్చట నుండి వచ్చెదవొ యెక్కడి కీనడిరాత్రివేళ, నీ
ముచ్చట దీర్ప తారయను మోహిని రోహిణి లేరె, చాలరా?
మచ్చ యొకింత కల్గెను సుమా, భవదీయ చరిత్ర లోనె, నా
కచ్చెరు వయ్యె నీగమన మంతయు జూడ కురంగలాంఛనా!॥

ప్రణయ మూర్తుల నూత్న దంపతుల జూచి
పూల బాణుడు బాణము ల్పూల నేయ
నీవు కూడను వారున్న తావు జేరి
విరహ తాపము తోడ నొప్పింతు వేల?

అన్నుల మిన్నలౌ పడుచులందరు నిన్గొని యాడుచుందు రీ
వెన్నెల శోభయే విరహ వేదన యంచు, ప్రియుండు చెంత క
న్పన్నలనుండి సౌఖ్యపడు చానలు చల్లని పిల్లగాలిలో
యెన్నియొ మెచ్చుకో లులను యేమొ వచింతురు నిన్ను జాబిలీ!॥

రాతిరి యంత ప్రేయసి కరాలను నల్గిన యట్లు సోలుచున్
యాతర పాటుతోడ సఖుడక్కడు వచ్చు నటంచుసిగ్గుతో
భీతిలి పూలపాన్పు దిగి వేగిర మేచను చుంటివా శశీ!
కాతరు కైవడిన్ కలువ కాంతల కన్నులు చెమ్మగిల్లగన్॥

* యీ గుర్తుగల పద్యములు ఆల్ యిండియా రేడియో విజయవాడ కేంద్రములో చదువబడినవి.

# 13. గ్రంథాల యోద్యమము

కరము లొప్పడ్చి సభాసదు ల్సలిపి రగ్రస్థానము న్నీకు, బం
గరు గద్దె న్పరివేష్టితుండవయి యుద్గ్రంథంబుల న్గూర్చి, వా
గ్భరము ల్దూగ నుపన్యసింపగదవే, గ్రంథాలయ శ్రేణిలో
హరి సర్వోత్తమరాయ! నీయశము వాహ్యాళించె రాచిల్కయై॥

వార్ధక్యంబు ఘటిల్లినన్ కనుల చత్వారంబు సంధిల్లినన్
యర్థింపంగ సమాజపు న్సభల కధ్యక్షుండవై నేటికిన్
నిర్ధారింపక నెంత దవ్వయినగానీ యేగి వాక్కుచ్చు వా
గర్థంబుల్ విఘ్నలంబుగా నిలిచెబో, గ్రంథాలయత్రాత! నీ
స్వార్థత్యాగమె రత్నసౌధమయి భాస్వద్దివ్యభాండారమై

గాడిచర్ల వారి గ్రంథాల యోద్యమ
దివ్యరథము బయలు దేర జొచ్చె
రథము సాగిపోవ ప్రజలెల్ల రజ్జువుల్
పట్టి లాగ నడుము గట్టి రండు॥

హృదయాంతర్గత భావ వీచికలతో హేరాళ గ్రంథాలయ
భ్యుదయంపున్రహదారి జూపితివిగా ఘంగ్రామణీ గ్రంథముల్
చదువ న్నూచనెడు పిన్నపెద్దలకు నాల్కాల్ పైన నీనామ మ
య్యదియేమో నటనం బొనర్చుగుణగణ్యా! గాడిచర్లాన్వయా!॥

గాడిచర్ల వంశాన్మణి ఘనత మీఱ
సరసు డయ్యంకి రమణయ్య మురిసి పోవ
జ్ఞాన పదముల నింటింట సక్తమైన
విమల గ్రంథాల యమ్ములు వెలయు గాత॥

---

గ్రంథాలయ సర్వస్వము పత్రికలో ప్రచురింపబడినవి.

# 14. ప్రకృతి

మణిమయరత్నభూషలను ప్రాగ్ధిశకన్య ధరించి కంఠసీ
మను, చెలువొందగా తిలకమూ యనునట్లు యినుండు ఫాలమం
దున, సుమగుచ్ఛము ల్తలను దోగపరంజిపసిండిగిండిఁ బు
వ్వను దినిపించెడు న్పవన బాలుని చంకను బుజ్జగించుచున్॥

జలధులు, సూర్యచంద్రులును, శైలము లెల్లనదీనదంబులున్
విలసిత పుష్పవాటికలు వింతవసంతలతాంతకాంతులు
జ్వలసురకార్ముకచ్ఛటల ప్రసన్నదనం బపరాబ్ధి దేలు ర
వ్వల రతనాల్ప్రవాళముల వన్నెలు చిన్నెలు సృష్టివైఖరుల్॥

చల్లని పిల్లతెమ్మెరలు శారద రాత్రుల యందు చంద్రికల్
వెల్లువగా స్ఫురించి కనువిందులు జేయఁ మహీరుహంబు ల
ల్లల్లన మేలమాడు కొను లాలన కల్వలఱేని జూడఁ సం
ఫుల్లసరోజమై తనువు పొంగు మహాశరధీ సదృశ్యమై॥

పున్నమనాటిజ్యోత్స్న, తలపు ల్వలపు ల్జనియించు జాళువా
వన్నెలు, గంధలుబ్ధమధుపంబులు, దైవవిచిత్రసృష్టిలో
ఔన్నతు లింబుల న్దెలుపు, నంబర వీధిని నంబుదంబు లు
ద్భిన్నములై, రథంబులయి, బెబ్బులులై, పెనుకుంజరంబులై॥

బకసంతతులు మింట శుకపికంబులు గూడి
గుంపులై విహరించు కొమరుగాంచి
పంటవలతి మేన వ్రాలు సస్యశ్యామ
లంబుల స్ఫీతమాడంబు గాంచి
మత్తగజంబులు బార్లు తీర్చినయట్లు
చూపట్టు గిరిపంక్తి సొంపుగాంచి
గువ్వలదంపతుల్ గుడిగోపురంబుల
గూడిసల్పెడు గుసగుసలుగాంచి
యలరు లొసగు పూదేనె విందార గింప
ఝుమ్ము ఝుమ్మన వ్రాలెడు తుమ్మెదలను
గని, నిజకరావలంబన కల్గజేసి
కాలపురుషుడు మన్మథలోలుడగుచు
వనితఁ ప్రకృతిని కులికించు కొనదొడంగె॥

వీర విహారమున్నలిపి విశ్వ నవోఢ కటిస్థలంబునన్
జారి, సరోరుహాప్తుడు, నజాండము బాయఁ పసిండికాంతులే
భైరవ రేయిగా పొడమ భామిని యామిని యంఘ్రిసక్త మం
జీరఝుళంఝుళారవము చీకటి కోన ప్రతిధ్వనించెడున్॥

# 15. దేవదేవ

పుణ్యమని పాపమని తలపోయు జనులు
పాపమన నెట్టిదో ? పుణ్యమన్న నెట్టి
దో ? వచింపుము భక్తితో దైవ మంచు
కావుమని గొల్తురెవరిని ? దేవ దేవ! ॥

రాళ్ళ ముందు నన్నరాసులు బోతురు
హారమని యఘుపరిహారమంచు
యన్నరాసులఁ మెతుకైనను కదలదు
దేవుడేడ ? మరియు తినుట దేడ? ॥

జీవకోట్ల లోన జేరి యుండును సత్య
మాత్మలందున పరమాత్మ యందు
చీమ మొదలుగాగ సింగంబు వరకును
జీవిఁ జీవి తినగ జేసి తేల ? ॥

పంట చేలలోన వడ్లకంకులు దూసి
పక్షి సంతతి కిడవచ్చు నంత
గూటి యందున తమ కూనలు గనరావు
యేమి మాయయొ వచియింపు దేవ॥

మానవులు జనించుడు రొకట మాదిరిగనె
ఒకడు కుంటియౌ, గ్రుడ్డివా డొకట డౌను,
రాజగు నొకండు, నొకడు విరాగి యగును
వింత వింతల సృష్టి గావింతు వీవు
యింత పక్షపాతంబు నీకేలదేవ ?॥

చచ్చి మరల మరల జన్మ లందుచు నుండు
జీవ రాసు లాత్మ లీవె యైన
చచ్చు వారు వెండి జన్మించు వారును
యెవ్వ రీరహస్య మేమి దేవ ?॥

కేళి దేలుచు పాప లుయ్యేల లందు
నవ్వు కొండ్రు తమంతనే కెవ్వు మంచు
యేడ్చు చుందురు కొట్టి నల్లైవరో దేవ
యాడి యాడి పోదువె వారి నేడిపించి॥

సత్యమననేమొ ? యేదియో నిత్య మనగ
చచ్చు వారలు పోదు రెచ్చటికి ? యేది
నిరయ మీజీవులకు, నెటుఁ నిగ్గమింతు్ర
వినుప వేడెద నాకు సవిస్తరముగ॥

# 16. విశ్వదాత

* అకలంకుండు కళాప్రపూర్ణు డనుప్రఖ్యాతిన్సమార్జించి తే
సకలాశాంతరవాసులౌ సుజను లాశ్చర్యంబు నన్మించుచున్
సుకళా శ్రీగల విశ్వదాత యని దేశోద్ధారకుండంచు మె
చ్చి, కృపాంభోనిధి వంచు చెప్ప నిను కాశీనాధ నాగేశ్వరా!॥

* నిరతంబు న్విబుధోత్తము ల్పొగడ నీదాన ధర్మించి తా
దర నానా సుగుణంబుల న్దెలుపుచున్ధాత్రి జనవ్రాతముల్
యరుసంబందగ కోర్కె లిచ్చితివి ద్రవ్యానంద మున్గూర్చుచున్
చిరునవ్వొప్పగ నీ ముఖాబ్జమున కాశీనాధ నాగేశ్వరా! ॥

*యతి లోకోజ్జ్వల దాన సద్గుణ ఘనఖ్యాతుండు కర్ణుండు భూ
పతి సంస్తుత్యు డటంచు వింటి మదిరా వాల్లభ్య సంయుక్తుడౌ
యతని న్నీనిజకీర్తిచంద్రికలతో నయ్యారె నిర్జించి తం
చిత భంగి న్జను లక్కజం పడగ కాశీనాధ నాగేశ్వరా! ॥

* సమయంబున్మదినెంచి యర్థి జనరక్షాదక్ష పుణ్య క్రియా
క్రమము న్జీవిత కాల మందు జరుపం గాజాలి తౌరార యాం
ధ్రమహీకాంత పవిత్ర గర్భమున రత్నంబన్న నీవేలభిం
చె మహాకీర్తిధనంబు పూజ్యుడవు కాశీనాధ నాగేశ్వరా! ॥

రాత్రిల్ తిర్మల వేంకటేశుగిరి మార్గంబందు నన్వేనవేల్
యాత్రికు ల్గడు సిల్గు లన్పడగ త్రోవల్ గానమిష్టూచి నిన్
స్తోత్రింబు ల్పొనరింప నిల్పితివి విద్యుద్దీపముల్ తిర్పతి
క్షేత్రం బందున నవ్యత ల్గులుక కాశీనాథ నాగేశ్వరా! ॥

అర్థి జనులకు కల్పక మైజ నించి
యడుగు వారికి లేదని నుడువ కుండ
జేసి, దాన ధర్మములను సిరికొలంది
కలియు గంబున నభినవ కర్ణు డంచు
శాశ్వత యశంబు గొంటివి విశ్వదాత! ॥

ఆంధ్ర పత్రికలో నమృతాంజ నమున
ప్రతిఫ లించు నీపులిచూపు ప్రతిమ గాంచి
పులక రించగ తావకోజ్జ్వల చరిత్ర
యంజ లింతురు ప్రతిదిన మాంధ్రు లెల్ల॥

* ఆతత చిత్తశాంతి యనయంబు ఘటిల్లెడుగాక క్రిన్నన న్
దాతకు సత్క-విత్వగుణధన్యచరిత్రసమన్వితద్విజ
వ్రాతకు దానసద్గుణవిరాజిత నవ్యమనఃపయోజ వి
జ్ఞాతకు పద్మగర్భకుల సాగరజాతకు విశ్వదాతకున్॥ ॥

---

* యీ గుర్తుగల పద్యములు ఆంధ్రపత్రికలో ప్రచురింపబడినవి.

# 17. కవిత

పెద్దన రామలింగడును పింగళి సూరన భట్టుమూర్తియున్
ముద్దులు మూటగట్టు కవి ముఖ్యుడు తిమ్మన రుముఁడాదిగా
వొద్దిక లెల్ల బిట్టలర నుండిరి రాయల కొల్వుకూటపుం
గద్దె లలంకరించి కవి గర్వము సర్వము నిర్వహించుచున్॥

కృష్ణరాయలునీకు కీలించె పాదాన
　　రత్నతాపిత మైన రవల యందె
భోజుండు నీకిడె పూజించి సభలోన
　　హంసమా నెమలి సింహాసనంబు
ముత్యాల కోవ లింపుగ వైచి కీర్తించె
　　పెగ్గెలతో నష్ట దిగ్గజములు
గళమెత్తి మొల్ల మంగళ హారతులు పాడె
　　కలకంఠ నాద సంకలిత యగుచు
లీల నామది పసిడి పళ్ళెరము గాగ
భావ సంసర్గసురభి పుష్పముల తోడ
పొగడు కొందును నీపాద పూజ జేసి
సంత తానంద మొలికింప జాలు కైత
లల్లు కొందును హృదయంబు పల్లవింప॥

కవులు దరిద్రులన్న నుడికారము వాపి, నిరంతరంబు నై
రవదశ నేత్రి! సత్సుభకరంబగు శ్రీల నొసంగలేవె ? నీ
వవిరళభోగభాగ్యమహిమాఢ్యులుగా విలసిల్లు మేటి పా
టవమును కల్ల జేయగ గడంగ వదేల శుభప్రదాయినీ॥

జీవిత మెల్లనీ విమల సేవకు నర్పణ జేయ కౌతుక
శ్రీవిధి బద్ధుడై చివికి చింతలఁ క్రుంగి కృసింపగా కృపా
ప్లావిత మానసాబ్జ! పదభక్తుడు సత్కవి కీయవేల చి
రావహ మాను దండి యుపహారము లెవ్వియు నోసుభాషిణీ!

పవలును రేయి గ్రంథములు వ్రాసి ప్రజా విభవంబుగోరు,స
త్కవుల గృహంబులం దినుప గజ్జెల తల్లి నటింపఁ, లేమి చే
నవయుచు నుండుడంచని యనాదిగ నీవు స్థిరాక్షరంబుగా
కవులను వారలెల్లర ముఖంబున వ్రాసితి వా ? తలోదరీ!

రాజాస్థానమె తావలం బగుచు సామ్రాజ్యాధి పత్యోన్నతుల్
ప్రాజారుల్,కురియింప శీర్షమున కెంపుల్ వజ్రవైడూర్యముల్
తాజా కాంతులు జిమ్ముచుండ, నిజ పుత్రశ్రేణి దీవింపు మ
వ్యాజానుగ్రహ మొప్పగా మనగ నవ్యశ్రీ మహాడోలలన్॥

# 18. స్వరాజ్య రథము

యిచ్చె స్వరాజ్య మంచు మది తృప్తి వహించెదవేమొ, సోదరా
నిచ్చని రక్తధారల స్రవింపగ గుండెలు శ్వేతజాతి వా
ర్విచ్చు కఠారుల న్విడచి వేసరి పాటున లేచిపోవగా
వచ్చె స్వరాజ్యమున్ స్వపరి పాలన నేటి కుపాయనంబుగన్॥

పొచ్చెము లేని యీభరత భూమిని జొచ్చి నిరంకుశంబుగా
వుచ్చులు బోసి కంఠముల కూపిరి బట్టుచు రాజ్యమేలు చున్
వచ్చిరి, భారతీయులు రణచ్ఛరణాంగదముల్ధరింపగా
చిచ్చు రగిల్చి, యాదొరలు సీమల కేగె, విభేదకీలలన్
పచ్చనిపండు కాపురము వ్రయ్యలువ్రయ్యలు చేసి నీర్ష్యతోన్॥

యీస్వ రాజ్య రథము నెందఱెం దరుగూడి
వెలికి లాగ బూని విఫలు లైరి
యరువ దేండ్ల నుండి నరబలి గోరుచు
సాగి వచ్చె నేడు లాగు కొనుడు॥

ప్రథమ యత్న మందు రథచక్ర ములక్రింద
మ్రగ్గి నారు చాల మంది, నేడు
వారి వారి త్యాగ నీరజం బులుగూడె
పొందు గాస్వ రాజ్య స్యంద నముగ॥

మహాతుండు మోతిలాల్మాళవ్య యన్సారి
కోటీశ్వరులు శ్రీలు గ్రుమ్మరింప
ప్రాణంబు లనుతృణ ప్రాయంబు గాభగ
వత్సింగు వీరుడై బలియొ సంగ
యోధుడు, స్వార్థంబు యోసరిం చినబోసు
వీర ర క్తము నేక ధార వోయ
వనిత కస్తురి, సరోజిని నాయుడుత్కంఠ
మున వేడి వీర చందనము బూయ
వసుధ పరరాజ్య పాలనా వార్ధి నీద
కుంభ ములుబోసి కోటాను కోట్ల జనులు
పగ్గములు ప్రాణముల్బిగ్గ బట్టి లాగ
కదలెను, స్వరాజ్య రథము, యేకమయి రండు
రండు రండు రత్నాల హారతుల నీయ॥

# 19. ఆంధ్రకేసరి

ఆహవ రంగమందున మహాత్ముని శాంతి రథంబుదోలుచున్
సాహస మూనిఘోర చెఱసాలల కేగి స్వరాజ్యసిద్ధికై
కాహళ మూదినాడవు, యఖండరమావిభవంబువీడి, గాం
ధీహాయలొప్ప, లేరిలను, నీసరి, కేసరి! యాంధ్రకేసరీ!॥

ఉమ్మడియా స్వరాజ్యపు మహోదయ మున్గన వేనవేలు రా
జ్యమ్మున, దండఘట్టనల యార్భటి కిన్జను లెల్ల వేల నో
క్కుమ్మడి నంగవించి, యరికోటి నెదిర్చి కిశోరమూర్తివై
బొమ్మల జేసి నిల్పితి వపూర్వమ్మ గేంద్రపరాక్రమోన్నతిన్॥

వాయు తనూభవుండు కపి వర్గశిరోమణి, గుండెచీల్చి ను
గ్రాయత మూర్తి, వక్షమున రాముని జూపిన మాడ్కి, పూనికన్
కాయము హేయమం చెదను గాంధి మహాత్ముని నుజ్జ్వలింపగా
జేయగ నెంచి, గుండె గురి చేసితి వంట తుపాకిగుండ్లకున్॥

మిమ్మటమైన దాస్య తమి మేదిని నల్గడ లన్ప్రగాఢమై
క్రమ్మ, పరప్రభుత్వమను కారు మొయిళ్ళ పరంపరల్ స్వదే
శమ్మున చుట్టుముట్ట, జయచంద్రుడ వైతివి, దేశభక్తి మూ
లమ్మున, నంధకారపటలమ్ముఖిలమ్ముఖిలమ్ము జేయుచున్॥

నిలువు దోపా సంగి నిల్చిన త్యాగియే
దేశ నాయకుండు ప్రకాశ మనుచు
పూసు మ్రోగె గెల్లు మాగాణ ములయందు
టంగు టింగు టుగను టంగు టూరి!

ఆంధ్ర రాష్ట్రము దోర్త రూపంది నపుడు
యాంధ్ర ముఖ్య మంత్రిగ సల్పె, త్యాగ మూర్తి!
యాంధ్ర కేసరి! నిన్నఖి లాంధ్ర కోటి
యధివ సింపగ జేసి సింహాస నమున
వైభ వంబుగ జయజయ ధ్వనుల తోడ॥

మురుసు కొనిరి నాడు ముక్కోటి యాంధ్రులు
గర్వ మొప్ప "మాప్రకాశ మనుచు"
నిన్ను జూచు కొనుచు నింగినంటిరి, నేడు
పొగులు చుండ్రి ఖేద పొగలు క్రమ్మ॥

టంగు టూరి యాంధ్ర సింగమా! నిర్యాణ
మంది నావు, వసట గుంది నారు
నాయ కాగ్రణులు జనంబు లెల్లరుగూడ
నాడ దెంత దుర్దినంబో గాని॥

ఆంధ్ర నాయకు లెల్లర కండ దండ
యైన ధీశాలి కాలగర్భాన గలసె
విస్తు కలిగించె కేసరీ యస్తమయము
కాల సర్ప మెంతటి విషజ్వాల గ్రక్కె!

స్వర్ణ పేటిక యందు భాస్వంత మగుచు
రాజ బాట ప్రభుత్వ మర్యాద తోడ
సైనికులు వందనంబుల సల్పు చుండ
జేరి, పతిత కృష్ణానదీ తీర మచట॥

అయ్యొ దేవర కాళేశ్వ రాఖ్యు డశ్రు
తర్ప ణంబున వీడ కృష్ణార్ప ణముగ
మజ్జ నంబాడె నీచితా భస్మ మకట
కృష్ణవేణీతరంగ సంకీర్ణమగుచు॥

కృష్ణ, గంగ, గౌతమి, దైవకృతములైన
నదుల యందు కూలంకషనదములందు
నీరు దాివగ ధరణిఁజన్మించు గాక
భరత పుత్రుల నాంధ్రకేసరులు వేలు॥

# 20. భారతీస్తవము

* కన్నుల నీరు పెట్టుకొని కన్పడి నావని యూరడించె పో
తన్న, తనూభవుండన నతండగు నీకితరుండు బిడ్డడా?
మన్నన కాసజెంది ధనమాన్య సమార్జన సేయగోరి ని
న్నన్నువ గాజనాధిపున కమ్మదలంచిన వాడు భారతీ॥

* నిరతంబు న్మదిలోన నీచరణ సాన్నిధ్యంబపేక్షింతు రా
త్రివేళన్ దినమందు నీవిధమె చింతింతున్ సుతానీక సా
దర వాక్యంబుల నాలకించి మహితోద్యత్ప్రీతి రక్షింప స
త్కరుణావార్ధివి నన్ను గాచుటొక లెక్కా పత్రిమా! భారతీ॥

* నాలుగు దిక్కుల న్మునిగణంబులు వేదము లన్పఠింప వి
ద్యాలయ మోయనన్ బరగు నక్కమలోద్భవు లోకమందు పే
రోలగ మందు నాథుని నిజోరు తలంబున నుండ జూడగా
జాలునె యెవ్వడేని శతజన్మము లెత్తిన నిన్ను భారతీ॥

అమ్మరో నీవె దిక్కన మహత్వకవిత్వపటుత్వభవ్యభా
గ్యమ్ములను గూర్చినావు కనికారమునన్ కవిరాజులున్క రీం
ద్రమ్ముల నెక్కినారు కవితారమ దిగ్విజయంబొనర్చినా
పొమ్మని త్రోసిపుచ్చకయె పుత్రుడ నన్కరుణింపు భారతీ॥

* చిరునవ్వాననసీమదోప సభలో శ్రీనాథు నెక్కించి భా
స్వరరత్నాంచితకాంచనాసనమునన్ బంగారు టంకాల బో
సిరి భూనాథులు మెచ్చి రాష్ట్రజనముల్ జేజేలు వెట్టంగ నా
కరణిన్ గౌరవ మందినాడన భవత్కారుణ్యమే భారతీ॥

సంశయ ముండబో దతుల సత్కృప నీవు కనుంగొనంగ నే
వంశము నన్చరించినను పండితు డౌగద కాళిదాసు స
ద్వంశము లోజనించినను పామర జాతి మెలంగనేర్చె నీ
యంశజు డోయనన్ కవిజ నాగ్రణినా యశమొందె భారతీ॥

కంబు సమానకంఠి యుపకారము సల్పెడి వారలుండగా
పంబిన వేడ్కతో పరుల బాధలు వెట్టెడి వారులేరె లో
కంబున నట్టిదుర్గుణము కల్గగ నీయకు మమ్మనాకు భా
వాంబుజ మంజులాసన సమర్పణ జేసితి రమ్ము భారతీ॥

* వాణిని సర్వశబ్దచయ బంధుర కోవిద సన్నుతాంచిత
శ్రోణిని నీలవేణిని సరోరుహపాణిని రక్షితద్విజ
శ్రేణిని భక్తియుక్త ఘనశేముషిధుర్యకవీంద్రమానస
క్షోణిని నిన్భజించెదను సుందర చంద్రనిభాస్యభారతీ॥

* కాంతారాంతర వాసయోగి జన సంఘాతంబు చందంబునన్
స్వాంతాంభోరుహమందునిల్పి నినునిష్టన్ధ్యానము న్జేయుచున్
యింతీ! కాలము బుచ్చగా దలచినన్ యీదార పుత్రాదు ల
శ్రాంతంబున్ చెడగొట్టు చుందురు మనశ్శాంతిన్ సతీ! భారతీ॥

లలితశిరీషపుష్పమృదులస్ఫుటహాటకగాత్రి వెట్టులన్
కలసి విరించితోడ కలకాలము కాపురమీవొనర్చెదో
తెలియగ జాలదయ్యెను సతీమణి వోట సహింతువేమొ యా
నళినజు డంకమందునిచి నాతిరో కౌగిట జేర్ప భారతీ॥

* విలసిత వామహస్తమున వీణ ధరించి సుధారసోపమో
జ్జ్వల ఘనకీర్తనావళుల పాడవె గౌరియు దేవకామినుల్
జలనిధి కన్యకా మఱియు సంతస మందగ సత్కవీంద్ర మం
డలవినుతాంఘ్రిపంకజ జనవ్రజవంద్యపదాబ్జ భారతీ॥

* ఫుల్లాబ్జానన నీపదాంబుజ యుగంబున్ భక్తి నర్చింపగా
నుల్లాసంబు ఘటింపవే కవులకున్ నుల్లంబు నన్నిల్చి శో
భిల్లంజేసి సమస్త శబ్దవితతిన్ ప్రీతిన్ యశఃకాయులో
తల్లీ! పోతన తిక్కనాది కవిధాతల్ భారతీ సుందరీ॥

* ఉత్తమ కీర్తిశోభిత దిశోత్కరు రాజమహేంద్రు గౌరవం
బత్తరి పొంది నన్నయ మహాకవి యాంధ్రకవిత్వతత్వ భా
వార్త మనఃపయోజుడమలాత్ముడు వాగను శాసనుండు తా
గ్రొత్తగ భారతంబు తెనుగుం బొనరించి చెలంగె భారతీ॥

* వినుతాచారుడు పండితుండుసుగుణోపేతుండు భోజుండుభూ
పనికాయాధికు డాదరించె సుకవి వ్రాతంబు గీర్వాణ భా
షను కబ్బంబును సెప్పువాడు కవితా సామ్రాజ్య ధౌరేయు డ
య్యెను నేడట్టి విధంబు ధాత్రి గఱవయ్యెన్ కాదో కో భారతీ॥

*శ్రోత్రల్ నెమ్మదినక్కజం పడగ నాశుప్రౌఢి పద్యావళిన్
ప్రీతిన్ వేనకు వేలు చెప్పెగద పృథ్వీనాథ చూడామణుల్
జాతానందము తోడ కానుకలిడుచున్ సన్మాన ముజ్జేయ వి
ఖ్యాతిం గాంచిరి నీకృపారసమునం గాదే కవుల్ భారతీ॥

ఆకమలాసనున్ సురగణార్చిత పాదపయోజుఁ భర్తగా
జేకొని వేడ్కఁ గాపురము జేసెడి భాగ్యము కల్గెనీకు ము
ల్లోకము లంగలార్చి సతులుం సములౌదురె? సృష్టికర్త యే
నీకు విభుండు నీసలుపనేర్చిన నోము ఫలించె భారతీ॥

ధవుని సుఖంబుగోరు వనితామణి సద్గుణ భార్యకల్గినన్
యవిరళ సౌఖ్యవార్ధి ననయంబు నిమగ్నుడగున్ మనోహరుం
డువిదయు దుర్గుణాన్వితగ నుండిన నారక ఘోరబాధయే
భువిఁ గనుచున్ కుటుంబమున పొందడతండు ముదంబుభారతీ॥

*తెనుగుం కబ్బముసెప్పువారల మహోధీగోత్ర మన్వాతమున్
ఘన కారుణ్యకటాక్షవీక్షణల సత్కారంబు గావించి జీ
వనమున్ జేయగ నొందు మార్గమును జూపంగల్గినన్ రాజు లా
జననంబుల్ సఫలంబులౌ కవికి దాస్యంబుండునే? భారతీ॥

నాతికి ప్రాణనాథచరణద్వయ పంకజ యుగ్మదాస్యవి
జ్ఞాతికి, కామినీ నికర సన్నుతి పాత్రి పతివ్రతాగుణ
ఖ్యాతికి, పాపరాక్షస విఘాతికి దాసజనానురాగ సం
ప్రీతికి, నీకు మ్రొక్కెద విరించి సతీతిలకంబ భారతీ॥

ఆతత షడ్సహస్ర మహితాంబుజ గర్భకులోద్భవుండ వి
జ్ఞాతుడగాను పండితుడగాను కవీంద్రుడగాను కాని నే
డోతరుణీ భవన్మహిమ మొక్క కవిత్వము చెప్పువాని నీ
రీతి నొనర్చె నన్ను భళిరే! మహిమాన్వితవీవు భారతీ॥

---

* యీ గుర్తుగల పద్యములు ఆల్ యిండియా రేడియో విజయవాడ కేంద్రములో చదువబడినవి.

# కర్ణుడు

నరవరసంఘమౌళిఘననవ్యకిరీటమణిప్రభాలస
చ్చరణసరోజుడౌచు ననుజన్ములతో ధర నేలుకొందు వీ
వరయగ లేవెనన్ను ? చతురబ్ధిపరీతమహీతలంబు నీ
పరమొనరించి చేసెద, నృపాలవతంసుని సూర్యనందనా॥

ఉదయం బందితి వీవు కుంతిగనె ఖద్యోతుండు సంయోగివై
ముదమందన్, నినుబెంచె రాధ జననంబు న్గాథ నాలించి పు
త్రిదయ న్జూపుచు మాతృదేవతను సందర్శింప గారమ్ము, ద్రౌ
పది నిన్నారవ భర్తగా బడయు నీభాగ్యంబు సామాన్యమే!॥

ముందెరింగియు నే సంధి పొసగ దంచు
వచ్చి నాడను నీకు వివ్వాచ్చు నకును
సంధి బొనరింప, మాతృ పక్షంబు మాది
పాండవులునిను గొనిరాగ బంపి నారు
పొందు గోరుచు, కర్ణ ! యేమందు వీవు?॥

సదయాంతఃకరణా ! వచింతు విను రాజ్యంబేలు భాగ్యంబు నా
కొదవెన్ మున్నె సమస్తభోగములతో నుత్ఖ్యాతలూగించినన్
పొదలించెన్ కురురాజు, సంగరముఖంబున్ జొచ్చి చానుంటి న
న్నెదలో నమ్మిన స్వామినిన్ విడిచి యెట్లే తెంచెదన్ మాధవా?॥

నీతి పథంబువీడి మన నేర జనార్దన! బాల్యమాది గా
సూతుని చేతులన్ బెరిగి శూరుడనంచు యశంబుగాంచి నే
భ్రాతల గూడి రాజ్యమును పట్టము గట్టుకొనంగ గల్గప
ఖ్యాతి భరింపజాల హృదయంబు సహింప దికేమి జేయుదున్॥

కన్నెప్రాయము నాడు భాస్కరుని సఖ్యంబంది గాఢంబుగా
నన్నుం గన్నదిగాక మంత్రమున కన్యాత్వంబు వోనాడి, యే
తెన్నుం గానక గంగలో విడువ కుంతీదేవి, సూతుండెగా
నన్నుం బెంచెను, యంగరాజుగనొనర్పన్, జేసి రారాజుతో
నెన్నెన్నో బాసలు, నానతీయ గదవే యిందేరిఁ వర్జించుటల్?॥

ప్రళయ కాలానలస్ఫూర్తి పరిణమించి
సవ్యసాచి విజృంభింప జచ్చు వారు
కౌరవులమూఁక గుంపులై కదన మందు
చెప్పు చుంటిని సుంత యోచించు కొనుము॥

తారు నొడివిన దంత యదార్థ మయ్యె
ధరణి నేలగ దగువాడు ధర్మ రాజు
సంగరస్థండిలంబున సమసి తీరు
కురు బలంబులు పార్థుని కోహ టించి
యీావు కల్గుటఁ వారల కెదురు లేదు॥

వారిజనాభ! పాండవులు భండన మందు జయంబు బొంది దు
ర్వారరణప్రవీణులయి రాజ్యము నేలగలారు యాజిలో
కౌరవు లెల్ల మ్రగ్గెదరు గాని, సమస్తము నేనెఱింగియున్
చేరగ జాల వారల వచించుచు నుంటి త్రివాచికంబుగన్॥

అగణిత వీరసింహుడనలాక్షుని గెల్చిన జోదు నిల్వగా
మొగదల నీకిరీటపుసముజ్జ్వలరత్నమరీచిమాలికా
ద్విగుణిత రోచులద్దనరు తేజు, రణంబున ప్రజ్వలింపగా
మృగయుల వేటల స్దగిలి మృత్యువుఁ గూడఁ శిలీముఖంబులన్
ఖగములు గూలు చందమున కౌరవ సంహతి నూచముట్టదే॥

ఎల్లి రణమున కడతేరి యేగు వాడ
స్వర్గ సీమకు నింతలో ప్రభుని వీడి
పోయె పాండవుల్ కడకు రాధేయుడనగ
తలను చుట్టుకుమయ్యా నిందను మురారి!॥

గంగ పుత్రుడు ద్రోణుడు కలర టంచు
కౌర వునిభాతి నీవును కలలు గనుచు
పొంగు చున్నావు వెన్నిచ్చిపోదు రనిని
మీర లెల్లరు వీరాధి వీరు లగునె?
కృష్ణు డున్నంత వరకు మాకీడి నెదుట॥

జలధిపరీతభూతలము సర్వము క్రుంగిన నింగి వంగినన్
జలజ ప్రియుండు పశ్చిమదిశన్ జనియించిన విస్ఫులింగముల్
జలజల రాల్చి యుద్ధమున శాత్రవ నాశము జేయుగాని, గా
సిలినను కర్ణుడైదుపది సేయని వాడని నీవెఱుంగవే?॥

రాధ కొడుకిట్లు నన్ను నిరాకరించె
నంచు హృదయాబ్జ మందున నెంచ బోకు
యేది నెట్లున్న పాండవు లేజయింతు
రనుట మున్మాటి కిని నిశ్చయంబు కృష్ణ!॥

తలలో నాలుకగా మెలంగితిని మిత్రిత్వంబు పెంపార, నా
వలనన్ గాదె సుయోధనుండు సమర ప్రారంభ సంరంభియై
కలుకన్ జొచ్చె రణంబులోమడియఁనాకుంజెల్లుమత్స్వామితో
చలనం బందగ బోడు కర్ణుడు, నమస్కారంబు భక్తప్రియా!॥